# రాజ్యసువార్త - ప్రకృతికా? ప్రజలకా?

**(మరో సంచలనాత్మక రచన)**

సర్వేశ్వరుడైన తండ్రి - జ్యేష్టుడు, ప్రియుడును ఆయన క్రీస్తు యేసుని సమస్తమునకు వారసునిగా నియమించెను. ఆ కుమారుని ద్వారా మానవ మేథస్సుకు అందని మహా విశ్వాన్ని, అందుచలించే పదార్థములను నిర్మించెను. వేల నక్షత్ర మండలాలను, సూర్యకుటుంబంతో పాటు కనబడిన, కనబడని పదార్ధ మంతయునూ, జీవముగలిగి కదలాడే సమస్తమును కలుగజేసి, క్రీస్తును సర్వాధికారిగా నియమించెను. కలిగియున్నదేదియూ ఆయన లేకుండా కలుగలేదన్న వాస్తవాన్ని ధ్రువీకరించి, పరలోకమందు తండ్రి కనిన జ్యేష్టునిగా, వారసునిగా నియమించెను. అందువలన క్రీస్తు తండ్రియైన దేవుని యొక్క తేజస్సును, ఆయన తత్వముయొక్క మూర్తి మంతయునై యుండి, తన మహత్తుగల మాటచేత సమస్తమునూ నిర్వహించుచుండెను. ఆయన మాటలలోని మహత్యమును వివరిస్తూ **- నేను మీతో చెప్పియున్న మాటలు ఆత్మయు, జీవమునైయున్నవి. యోహాను 6:63.** జీవము ఉన్నదియని బైబిలు జ్ఞానగ్రంధము ఘోషిస్తూ వున్నది. వాటంతటవే చలించే వాటికి జీవమున్నదన్న శాస్త్రాన్ని ఒక మెట్టు పైకెక్కి, చలించకపోయినా మిగిలిన జీవరాసులువలె పుట్టి, పెరిగి ఫలించే మొక్కలకు సహితము ప్రాణమున్నదన్న మన భారత శాస్త్రవేత్త జగదీష్ చంద్రబోస్‌కు నోబెల్ బహుమతిని ప్రకటించి, అన్నిటినీమించిన బైబిలుని మాత్రం ప్రక్కకు నెట్టిందీ ప్రపంచం. విశ్వమంతా **- దేవుని వాక్యం వలన నిర్మాణమైనది. హెబ్రీ 11:3.** అని బైబిలు చెప్పింది. దీనిని బట్టి విశ్వంలోని ప్రతి అణువు జీవముగలిగి ప్రకృతి అంతా ఆత్మతో నిండుకొని యున్నదని గమనించండి. ఆత్మను రెండువిధములుగా విభజించవచ్చును. అందు మొదటిది దేవుడైన ఆత్మకాగా, రెండవది ఆయన నుండి వచ్చిన మాటకూడా ఆత్మను, జీవమును కలిగియున్నది. తండ్రియైన దేవుని ఆత్మనుండి వచ్చినవారు పిల్లలుకాగా, ఆయన మాటనుండి వచ్చినదంతయూ పంచభూతముల కలయికలో నున్న ప్రకృతిలోని మిగిలిన జీవరాసులతో సహ దేవుని మాటవలన కలుగు ఆత్మను జీవమును కలిగియున్నవిని తెలియుచున్నది.

**- తండ్రియైన దేవుడు నేల మంటితో నరుని నిర్మించి వాని నాసికారంధ్రములలో తన జీవవాయువును ఊదగా నరుడు జీవాత్మ ఆయెను. ఆ.కా. 2:7.**

**- దేవుని ఆత్మ నన్ను సృజించెను. సర్వశక్తుని యొక్కశ్వాసము నాకు జీవమిచ్చెను. యోబు 33:4.**

**- తన నాసికారంధ్రములో ప్రాణముగలిగిన నరుడు. యెషయా 2:22.**

**- అందరికీ తండ్రియైన దేవుడు ఒక్కడే, ఆయన అందరికీ పైగా ఉన్నవాడై, అందరిలోనూ వ్యాపించి, అందరిలోనూ వున్నాడు. ఎఫెసీ 4:6.**

పైన వ్రాయబడిన వచనములను బట్టి తండ్రియైన దేవుని ఆత్మనుండి కుమారులైన ఆత్మలుగా దేవుని స్వరూపము. పోలికను కలిగిన వారమై తండ్రికనిన కుమారులముగా వున్నాము. అయితే ప్రకృతికి మాత్రం ఈ ఆత్మ వర్తించదనియూ ఆయన మాటలలోని జీవము, ఆత్మయు మాత్రమే వర్తించును. ఏలయనగా **- జీవాత్మగల సమస్తశరీరులలో పక్షులు, జంతువు మొదలగునవి రెండేసి, రేండేసి ఓడలో నున్న నోవహు నొద్ద ప్రవేశించెను. ఆ.కా. 7:15,22.** పొడినేల మీద నున్న వాటన్నిటిలోనూ నాసికారంధ్రములలో జీవాత్మ సంబంధమైన ఊపిరిగలవన్నియూ చనిపోయెను.

**- ఆత్మయు, జీవముగల తన మాటతో భూమ్యాకాశములను సృజించెను.**

**- గడ్డిని, విత్తనములిచ్చు చెట్లను భూమి మీద తమ తమ జాతి ప్రకారము తమలో విత్తనములుగల ఫలిమిచ్చు ఫలవృక్షములను భూమి మొలిపించుగాకనెను.**

**- ఆకాశ మండలిజ్యోతులు కలుగుగాకని పలికెను. చేపలను, పక్షులను అడవి జంతువులను, పురుగులను, భూమి పుట్టించుగాకని పలికెను. ఆదికా॥ 1:1-24.**

సృష్టికర్త తండ్రిఆత్మను కలిగి దేవుని పోలికలో కుమారులు చేయబడగా, ఆయన మాటలలోని ఆత్మయు, జీవమును బట్టి విశ్వము అందలి పదార్థము మిగిలిన జీవకోటి ఉద్భవించినదని వ్రాయబడినది. అందునుబట్టి విశ్వంలోని పదార్థమంతటికినీ ఆత్మయు, జీవమును ఆయన మాటనుబట్టి కలిగియున్నదని విశదమగుచున్నది. ఏలయనగా

**- ఆకాశమా ఆలకించుము, భూమి చెవియొగ్గుము. యెషయా 1:2.**

**- భూమి నీవునూ, నీలో వున్న సమస్తమునూ చెవియొగ్గి వినుడి. మీకా 1:2.**

**- భూమ్యాకాశములను మీ మీద సాక్షులుగా ఉంచుచున్నాను. ద్వితి ॥కా॥ 4:26.**

**- మీరు ఊరకుండిన యెడల ఈ రాళ్ళు కేకలు వేయును. లూకా 19:40.**

**- గోడలలోని రాళ్ళు మొఱ్ఱపెట్టుచున్నవి, దూలములు వాటికి ప్రత్యుత్తరమిచ్చుచున్నవి. హబక్కుకు 2:11.**

**- గాలిని, సముద్రమును గద్దింపగా మిక్కిలి నిమ్మళమాయెను. ఈయనకు గాలియు, సముద్రమును లోబడుచున్నవని చెప్పుకొరిని. మత్తయి 8:26,27.**

**- దేవుని కుమారుల ప్రత్యక్షత కొరకు, సృష్టి మిగుల ఆశతో తేరిచూచుచూ కనిపెట్టుచున్నది. రోమా 8:19-22.**

పై వచనములన్నింటిని బట్టి సృష్టిలోని పదార్థమంతటికినీ ఆయన మాటలలోని జీవమును, ఆత్మయు కలిగియున్నవని అర్థమగుచున్నది.

ఇక్కడెరుగవలసిన ప్రాముఖ్యమైన విషయమేదనగా దేవుడు - తన స్వరూపమందు తన పోలికచొప్పున చేయబడిన కుమారులకు ప్రకృతంతా తమ పరిచర్యలను అనునిత్యమూ అందించాలని దేవుని సంకల్పం మేరకే వాటి వాటి ధర్మాలను సర్వేశ్వరుని పిల్లలైన మన కొరకు జరిగించుచున్నవి. బైబిలు మహాజ్ఞానమును బట్టి అట్టి పరిచర్యలందించువారు కోట్లకొలదిగా వున్న దేవదూతలే సేవకులైన ఆత్మలుగా ప్రకృతిస్వరూపాలను కలిగి సకల సేవలందించుచున్నారనుటలో సందేహం లేదు. గతనారచనలలో అనేకసార్లు ఈ విషయములను మీముందుంచితిని.

**- తన దూతలను వాయువులుగాను, తన సేవకులను అగ్నిజ్వాలలుగాను చేసికొను వాడని తన దూతలను గూర్చి చెప్పుచున్నాడు. వీరందరూ రక్షణ అను స్వాస్థ్యము పొందబోవువారికి పరిచారం చేయుటకై పంపబడిన సేవకులైన ఆత్మలు. హెబ్రీ 1:7,8,14,** విశ్వమంతా దూతలమయమై, సృష్టికర్త మాటవలన జీవమును, ఆత్మను కలిగిన దేవదూతలు గానూ, పంచభూతములుగానూ, లేదా మహావిశ్వంగానూ మనకు సేవలందించుటకు నియమింపబడినవారు. చలించుచున్న విశ్వమంతా దేవుని మాటను బట్టియే జీవము కలిగినవిగా శాస్త్రప్రపంచం తెలుసుకొనవలెను. యావత్తుసృష్టికి కేంద్రబిందువైన భూమి నరునికి నివాసమై తన చుట్టూవున్న విశ్వపదార్థామంతటి సేవలను నరులకందించుచున్నది. ఎందుకనగా నరులు దేవుని పిల్లలగుటయే వారికివ్వబడిన భాగము. మనిషి అనాలోచనతో ప్రకృతిపై దేవునికున్న పెత్తనాన్ని తెలుసుకొనలేక బైబిలును ప్రక్కకు నెట్టి అన్వేషణలో పడ్డాడు. భూమిమీద దేవుని కుమారుడైన మనిషిని బ్రతికించటానికి నీరు, నేలపై కదిలే జీవరాసులతో సహ కదలని మొక్కలను కూడా ఆహారముగా ఇచ్చియున్నాడు. ఎగిరేపక్షులు, వర్షించే మేఘాలతోకూడా అంతరిక్షంనుండి మంచును కురిపిస్తున్నాడు. కట్టుదిట్టమైన, క్రమబద్ధమైన కార్యక్రమాలు ఆకాశము, భూమికి మధ్యనున్న పదార్థమంతటికినీ కార్యక్రమాన్ని ఖాయపరిచినాడు. సృష్టిమనుగడ కేవలం భూమిమీదగల దేవుని కుమారుని మనుగడకేనని ప్రపంచ అంతరిక్ష శాస్త్రవేత్తలు తెలుసుకొనుట మంచిది. ప్రకృతికినీ, మనిషికీ మధ్యనున్న బైబిలులో బయలు పరచబడిన రహస్యాన్ని మీముందుంచాలన్న ఆశతో మరో సంచలనాత్మక వివరణను మీకిచ్చుచున్నాను.

తండ్రి అనాది సంకల్పంలో తనకు కుమారులు కావాలనుకొని సృష్టిని కలిగించుట జరిగినది. ఎందుకనగా తన ఇష్టాన్ని నెరవేర్చుకొనడానికి కుమారులను, కుమారుల ఇష్టాన్ని నెరవేర్చటానికి ప్రకృతిని తన పిల్లలకు అనుకూలంగా సృజించియున్నాడు. శరీరాకారమును నిర్మించినప్పుడు దాని యందున్న అవయవములు వాటికున్న కోరికలను బట్టి సృష్టి

నిర్మాణం జరిగింది. నారు వేసిన వాడు నీరు పోయడా? నోరిచ్చిన వాడు భోజనం పెట్టడా? అనే ప్రశ్నలతో కన్న తండ్రియైన దేవునిని నిలదీస్తున్నారు. మానవ ఆకారంలోని కళ్ళకు కనిపించుటకు రంగులలోకాన్ని, నాలుకనుతృప్తిపరచుటకు సకలరుచులను, వినుటకు శబ్ధములను, అనుభవించుటకు ఆనందాలు మున్నగు వాటితో విశ్వమంతటినీ ముందుగానే నింపుతూ కలిగించియున్నాడు. ప్రకృతి నిర్మాణము  కోటాను కోట్లుసంవత్సరాలు జరిగినపిమ్మట అందులో చివరిసారిగా తన పిల్లలను అనుభవించుటకు అందువుంచియున్నాడు. ఆత్మ, జీవముతో కూడిన మాటతో నేలను పుట్టించి, అదేశక్తిగల మట్టిమండి తొలి మానవ ఆకారాన్ని దేవుడు తన కిష్టమైన విధంగా రూపుదిద్ది తనలో వున్న మహాశక్తియైన ఆత్మను విడగొట్టి మట్టి ఆకారములోనికిపంపెను. దీనినంతటినీ అప్పటివరకూ పరిశీలిస్తున్నది ముందుగా ప్రకృతియేనని బైబిలునందు చూడగలము. దేవుని రూపంలో చేయబడిన మనిషికంటే ప్రకృతే ముందు పుట్టినది గనుక దేవుడు చేయుచున్న ప్రతీ పనిని గమనిస్తూనే వున్నది. అప్పటినుండి పరలోకపు తండ్రి అభీష్టం మేరకు దేవుని పిల్లలైన నరులకు సకల విధములైన పరిచర్య ధర్మమును జరిగిస్తున్నది. అయితే దేవుని పోలికలో చేయబడిన మనుష్యులు మాత్రం ఆయన సంకల్పానికి, ఆలోచనలకు భిన్నంగా సృష్టికర్తపైనే ఎదురుబావుటా ఎగురవేసాడు. సృష్టిలో దేవుడు కనిన పిల్లల విధేయత, అవిధేయతలను తొలి మానవుడైన ఆదాము పుట్టుక నుండే సృష్టిగమనించటం విశేషం. ఎందుకనగా ఏ పిల్లల కొరకైతే కోటాను కోట్ల సంవత్సరాల వ్యవధిలో అపురూప విశ్వాన్ని కలిగించి దానిద్వారా వారికి  సకల సేవలు వారికి అందించినా, వాటిని  తేరగా అనుభవిస్తూ సృష్టికర్తపై ధ్వజ మెత్తడం ముందుగా పుట్టిన ప్రకృతికి మింగుడు పడుటలేదు. ఇట్టి వారిని భరించలేక సృష్టి మరణవేదనలు పడుచున్నదని మనకు తెలియజేయబడినది. - **సృష్టి యావత్తు ఇది వరకూ ఏకగ్రీవముగా మూలుగుచూ ప్రసవవేదన పడుచున్నది. నిజమైన దేవుని పిల్లల కొరకు అదే సృష్టి మిగుల ఆశతో తేరి చూచుచూ కనిపెట్టుచున్నది. రోమా 8:19,22.** తగిన సమయంలో అవిధేయులకు తగిన బుద్ధి చెప్పాలని అంతా ఎదురుచూస్తునే వుంది. దేవుడు ప్రవక్తలనోట పలికించిన ప్రవచనానుసారం ప్రతి మనిషికి తగిన శిక్ష వేసే రంగం ఇప్పటికే సిద్ధపరచబడినది. - **అన్నిటికీ కుదురుబాటు కాలములు వచ్చునని దేవుడు ఆదినుండి తన పరిశుద్ధ ప్రవక్తల నోట పలికించెను. అపో॥కా॥ 3:21.** మనిషి చేసిన ప్రతితప్పిదాన్ని విడిచి పెట్టక దానికి తగిన శిక్ష విశ్వంతోపాటు మనిషి అనుభవించక తప్పదను వాస్తవాలను తన కుమారుడైన యేసును మనుష్యుల మధ్యకు పంపి, అనేక హెచ్చరికలను చేయించాడు పాపపు ఊబిలో కూరుకుపోయిన నరుడు విని, మారుటకు బదులు కక్షతో యేసును చంపాడు. - **పొలము లోకము, మంచి విత్తనములు రాజ్యసంబంధులు, గురుగులు దుష్టుని సంబంధులు, వాటిని విత్తినశత్రువు అపవాది. కోతయుగ సమాప్తి, కోత కోయువారు దేవదూతలు (ప్రకృతి). మత్త 13:38,39.** మానవ జీవితము, ముగింపు ప్రకృతితో ఏ విధంగా ముడిపడినదో పై వచనములను బట్టి తెలుసుకొనగలరు. ఎవరి కొరకు ప్రకృతి సృష్టింపబడినదో, అదే ప్రకృతిని అనుభవించుటకు పుట్టిన మనిషి పతనావస్థకు చేరినప్పుడు పరిస్థితులు ఎలా మారుతాయో మనిషి ఇప్పటికైనా తెలుసుకొనుట మంచిది. సర్వసృష్టిని కలిగించిన సర్వేశ్వరుడే తనలోని ఆవేదనను గుండె బరువుతో అనిన మాటలు ఏమనగా - **భూలోకమా వినుము. ఈ జనులు నా మాటలు వినకున్నారు. నా ధర్మశాస్త్రమును విసర్జించుచున్నారు. యిర్మియా 6:19.**

- **యెహోవా సెలవిచ్చుమాట ఆలకించుడి. నీవు వచ్చి పర్వతములను సాక్ష్యం పెట్టి వ్యాజ్యెమాడుము. కొండలకు నీ స్వరము వినబడనిమ్ము. తన జనుల మీద యెహోవాకు వ్యాజ్యెం కలదు. ఆయన ఇశ్రాయేలీయుల మీద వ్యాజ్యెమాడుచున్నాడు. నిశ్చలములై భూమికి పునాదులుగా వున్న పర్వతములారా, యెహోవా ఆడు వ్యాజ్యెము ఆకలించుడి. మీకా 6:1,2.** సంఘంలోగాని, సమాజంలోగాని  లేదా కుటుంబంలో పరిష్కారంకాని తగాదాలున్నప్పుడు పెద్ద మనుష్యులను వివాదమును పరిష్కరించుటకు కూర్చుండ బెట్టుదురు. పెద్దలు మాటల, నిర్ణయాలప్రకారము పరిష్కారమగునట్లు దేవుని పిల్లలైన ఇశ్రాయేలీయులు తిరుగుబాటుకు భూలోకమును, అందలి పర్వతములను ఉద్దేశించిన దేవుడన్న మాటలు మీరు పైనచదివియున్నారు. ఎందుకనగా తన మహత్తుగల మాటలోని ఆత్మ జీవముతోకూడి సృష్టింపబడినదే. ఈ విశాల విశ్వం అనుక్షణం ప్రకృతి తనలో వున్న దేవుని పిల్లలను కనిపెట్టుకొని ఉండుటను బట్టి మన కదలికలన్నియూ అవి

తెలుసుకొనగలుగుచున్నవి. ఇక వాటికున్న అతిపెద్ద మనస్సు లక్ష్యాన్ని ఆలోచిస్తే - తమ్మును కలిగించిన సృష్టికర్తకు నమ్మకముగా లోబడి తమ కప్పగింపబడిన ప్రతీ పనిని జరిగిస్తూ దేవుని నీతికి లోబడుచున్నవి. వాటిపైనున్న నమ్మకం ఆయన స్వరూపమందు చేయబడిన మనుష్యులపై లేని వానిగా దేవుడు కనిపించుచున్నాడు. మనుష్యులు చేసిన పొరపాట్లను దేవుడు లక్ష్యముంచి వారిపై పెద్దలుగా ప్రకృతినే పిలచుచున్నాడు.

**- ఆయన తన ప్రజలకు న్యాయం తీర్చుటకై నా భక్తులను నా యొద్దకు సమకూర్చుడని మీది ఆకాశమును, మనమున్న భూమిని పిలుచున్నాడు. ఎందుకనగా ఆకాశము ఆయన నీతిని తెలియజేయుచున్నది. కీర్తన 50:5,4.**

**- ఆకాశములు దేవుని మహిమను వివరించుచున్నవి. అంతరిక్షమైతే ఆయన చేతిపనిని ప్రచుర పరచుచున్నది. పగటికి పగలు బోధ, రాత్రికి రాత్రి దేవుని జ్ఞానము అనగా దినమంతయూ దేవునికొరకు మనకు తెలుపుచున్నది. వాటికి భాషలేదు. మాటలులేవు వాటిస్వరము వినబడకపోయినా తెలుపుటలేదు అని తలంచవద్దు. వాటి బాధ్యతలు భూమి యందంతట మనుష్యులమధ్య వ్యాపించి యున్నవి. లోకదిగంతములవరకూ (సర్వలోకంనకు) వాటి ప్రకటనలు బయలు వెళ్ళుచున్నవి. కీర్తన 19:1-4.**

**- రాష్ట్రములారా నాయొద్దకు వచ్చి వినుడి. జనములారా చెవియొగ్గి ఆలకించుడి. భూమియూ, దాని సంపూర్ణతయూ, లోకమును దానిలోని పుట్టిన దంతయూ వినునుగాక. యెహోవాకోపము సమస్తజనముల మీదికి వచ్చుచున్నది. యెషయా34:1,2.**

**- ఆకాశమా దీనిబట్టి విస్మయపడుము, కంపించుము, బొత్తిగా పాడైపొమ్ము ఇదే యెహోవావాక్కు యిర్మియా 2:12.**

**- ఆకాశమండలమా చెవినొగ్గుము. నేను మాటలాడెదను. భూమండలమా నా నోటిమాట వినుము. ద్వితీ॥కా॥ 32:1.**

**- నేడు జీవమును, మరణమును, ఆశీర్వాదమును, శాపమును నేను నీ యెదుట వుంచి భూమ్యాకాశములను నేను**

**- మీ మీద సాక్షులుగా పిలుచుచున్నాను. ద్వితీ॥కా॥ 30:19.**

**- ఆకాశమును, భూమిని వారి మీద సాక్షులుగా పెట్టి నేను ఈ మాటలు వారి వినికిడిలో చెప్పెదను. ద్వితీ॥కా॥ 31:28.**

**- మీరు యోర్దానుదాటి స్వాధీనపరచుకొనబోవు దేశంలో వుండకుండా (ఇశ్రాయేలీయులు) త్వరలోనే బొత్తిగా నశించిపోవుదురని భూమ్యాకాశములను మీమీద సాక్షులుగా వుంచితిని. ద్వితీ॥కా॥ 4:26.**

పైన వ్రాయబడిన వాక్యములన్నిటినీ పరిశోధించండి. దేవుడు ఇష్టపడి చేసుకున్న మనుష్యుని పతనానికి కోపోద్రిక్తుడై ప్రకృతితో అనిన మాటల మనలను ఆశ్చర్య చకితులనుగా చేయుచున్నవి. దేవునికి, ప్రకృతికి, మనకు మధ్యగల బంధం జీవాత్మబంధంగా మనకు కనిపించుచున్నది. ఆయన మాటలలోని జీవాత్మే మనకు ముందుగా ప్రకృతిని సృష్టిస్తే పిమ్మట ఆయన మనలను తన ఆత్మద్వారా కనియున్నాడు. మాట ద్వారా ప్రకృతి పుడితే మహాశక్తియైన ఆత్మద్వారా మనం పుట్టియున్నాము.

**- నీవు నా కుమారుడవు నేను నేడు నిన్ను కనియున్నాను. హెబ్రీ 1:5.** ఆత్మ బంధాలను అర్థం చేసుకునే అలవాటులేకపోగా, మానవ జీవిత కాలమే మహత్తర భాగ్యంగా ఎంచుకొని కన్నతండ్రియైన దేవునికి, మనకు ముందు పుట్టిన ప్రకృతికి అసహ్యులుగా అవిధేయులుగా మారిపోతున్నాము. నాటినుండి నేటి వరకూ మానవ పతనానికి సాక్ష్యం ప్రకృతియే గనుక మనలను గూర్చిన పూర్తి సమాచారం సాక్షాలతో దానిదగ్గర భద్రపరచబడియున్నది. ఏదైతే లేక ఒక్కక్షణం బ్రతకలేవో అదే నీ పాలిటసాక్షిగా నిన్ను నిత్యాగ్నిదండనకు పంపుచున్నది. ప్రకృతిని చూసి శాస్త్రాలు వ్రాసిన శాస్త్రవేత్త మొదలుకొని దానిని ఆశ్రయించి తమ గొప్పతనాన్ని వెలగబెడుతున్న ధనవంతుల నుండి పేదవారి వరకూ ప్రకృతి సాక్ష్యాలతోనే పనికి మాలిన వారుగా తీర్పుపొంది నిత్యాగ్నిదండనకు దిగిపోయెదరు. ప్రకృతిలోని వజ్రవైడూర్యాలు, వెండిబంగారాలు, రత్నరాసులు మున్నగు వాటిని ఆశించి కడకు దోపిడి దొంగగాను, మోసకారిగాను మారి పైన దేవునిని, అనుభవిస్తున్న ప్రకృతిని

మోసగిస్తున్న నీకు ఏశిక్షవేయాలో దానికి తగిన సాక్ష్యాలకై ఆకాశమును, భూమిని అందలి పదార్థమునంతయునూ నీపై నిఘా (CBI, FBI) గా సర్వేశ్వరుడు వేసియున్నాడు. నీ చుట్టువుండు ప్రకృతి పదార్థపు కళ్ళు కప్పి, నీకై తపిస్తున్న కన్నతండ్రియైన దేవునికి విరుద్ధంగా ఏమిచేయగలవు? ఎలాతప్పించుకొనగలవు? చీకటిలో జరిగిన దానికి సాక్షాలు లేవనుకొంటున్నావా. వెలుగులో జరిగినా ఎవ్వరూ చూడలేదనుకుంటున్నావా? లేక భూమి మీద సాక్ష్యాలనే తారుమారు చేయాలనుకుంటున్నావా? విషమిస్తే న్యాయమూర్తినే కొనదలచుకున్నావా? ఇట్టి ప్రశ్నలకు భూమి మీద నీ మేధాశక్తి అధిగమించినా ప్రకృతిశక్తి, దైవశక్తి, ముందు కేవలం మట్టి బొమ్మవేనని మరచిపోవద్దు. నీవెంతటివాడవైనా అకాలమృత్యువుతో ప్రకృతి మధ్య అంతరించక తప్పదు. పంచభూతములు లేనివే ఉచ్ఛ్వాస్వ, నిశ్వాసములకు నోచుకోని నీవు ప్రకృతికెక్కడిదీ శక్తి అని తలంచుచున్నావా? భాషాజ్ఞానం లేని ప్రకృతి అన్నీవున్న నిన్నేమి చేయగలదని గర్వించుచున్నావు. నెమ్మదిగా వున్నవారు కొంపలు ముంచుతారు అన్ననానుడి వినేవుంటావు. అమాయకంగా ముఖాలు పెట్టి ప్రజలమధ్య తెలివిలేనివారిగా తిరిగే విజిలెన్స్ వారిని చూసే వుంటావు. నీతోనే కలిసి వుండి ఆఖరిక్షణంలో నిన్నప్పగించేవారిని చూసి నివ్వెర పోతుంటావు. ఇవన్నియు లోకంలోనీకు నిజమైన అనుభవాలే. అయితే వాటినన్నింటినీ మించినదే ప్రకృతిభూమ్యాకాశాల మధ్యపుట్టిన నీవు చచ్చినంతవరకూ ఆకాశాన్ని దాటి పైకి గాని భూమిని దాటిక్రిందకు గాని ఏప్రక్కకు పారిపోయి తప్పించుకొనలేవు. పుట్టుక ప్రకృతిలోనే, మనుగడ ప్రకృతిలోనే కడకు గిట్టుట ప్రకృతిలోనే, ఇది నిత్యం సత్యం అని తెలుసుకుంటే ఏ ప్రకృతిలో ఆదమరచి నిద్రపోతున్నావో అదే నీ పట్ల శాపమైనిన్ను పట్టి అప్పగించునని తెలుసుకొనగలవు. నేరస్థలిలో దొరికిన ఆయుధములు, రక్తమరకలు, వెంట్రుకలు, గుడ్డలు మున్నగునవన్నీ నువ్వునేరస్తుడివని నిన్ను పట్టి అప్పగించే సాక్ష్యాలైతే అవన్ని ప్రకృతి నుండి నీకివ్వబడినవే. తేరగా అనుభవిస్తున్న నిన్ను చూసిన ప్రకృతే కన్నెర్ర జేసి కాటికే పంపగలదు జాగ్రత్త. దేవునిని వెఱ్ఱిబాగుల వానిగా చేసి ప్రకృతినంతా కుక్కపిల్లగా భావిస్తే వాసనచూసిన నువ్వేనేరస్తుడివని తుదకది అప్పగించగలదు. మేధావిననుకొనే నీవు కనీస జ్ఞానం లేని మూర్ఖుడవని తెలుసుకో. నన్ను మించిన వాడు లేడనుకుంటే నిన్ను మించినదే నీ చుట్టూవున్నది. అశ్లీలత, కట్టలుతెగిన శృంగారం, నీమాట నీ పాట, నీ అవివేకపు నటన ప్రకృతినుండి తీయబడి రకరకాల పేర్లతో నీ మద్యనున్న పదార్థమే ఆడియో, వీడియో కేసెట్స్ మరియు సి.డి., డి.వి.డి.లు. మనిషి ప్రతి నీచ కార్యాన్ని ప్రకృతిలోని పదార్థామైన వాటినినీవే బంధింపగా లేనిది నీ జీవితకాలమంతటిలో నీవు జరిగించిన వాటిని ఆడియో, వీడియోలతో సహ నీ బ్రతుకుసంగతులు సాక్ష్యాలుగా ఈ ప్రకృతి, భద్రపరచలేదా? వెఱ్ఱిబాగులవాడు దేవుడని తలంచక, సృష్టిలో నీకున్న పిచ్చిమరి దేనికీ లేదని ముందు తెలుసుకొనవలెను. నరుడు కామాంధుడై లోకాన్ని స్నేహించి తనకు సర్వం లోకమేనని తలస్తే దేవుడునిన్ను శిక్షింపక విడిచిపెట్టడు. చలిజ్వరంతో చచ్చిన అలెగ్జాండర్, తన తుపాకీతో తన కణతను కాల్చుకున్న నియంత హిట్లర్, జంతువుల మధ్య జంతువుగా కొంతకాలం బ్రతికిన ప్రపంచ మహచక్రవర్తులలో ఒకడైన నెబుకద్నెజర్ వీళ్ళకంటే నీవు గొప్పపిచ్చివాడవా? అక్రమాలతో, అన్యాయాలతో, మానభంగాలతో, మారణహోమాలతో, దురాక్రమణలతో, ఘోరయుద్ధాలతో మునిగి పోతున్న నీకు ఎదురు లేదనుకుంటే నీకు రోజులు దగ్గర పడ్డాయని అర్థం. భూమి మీదనుండి తప్పించుకొని అంతరిక్షంలో మరోచోట దాగాలనుకుంటే అక్కడక్కడా నీవున్నది ప్రకృతిలోనని మర్చిపోవద్దు. నటనా, వేషధారణలతో ఎదుట అమాయకుడిని మోసపరచగలవేమోగాని, ప్రకృతిని దానికర్తను మోసగించలేవు సుమా.

కోడితన పిల్లలను బహుజాగ్రత్తతో తన రెక్కలతోకప్పి కాపాడును. ఎగిరే ఏ పక్షి అయినా వాటిని ఎత్తుకొని పోవునన్న జాగ్రత్త తీసుకొని తన చుట్టూ, తన క్రింద వాటిని వుంచుకొని వాటిని మేపును. ఇదినేడు మనకళ్ళముందు జరుగుతున్న వాస్తవం. అదే విధంగా ఆకాశమందు కూర్చున్న తండ్రి భూమిని తన పాదపీఠంగా ఎందుకు చేసుకున్నాడో తెలుసా? తన పాదాల చుట్టూ పడివుండమని, అనవసరంగా అంతరిక్షనౌకలలో ఎగిరినా తనకాళ్ళచుట్టే వుండగలవని నిన్ను భద్రపరుస్తున్నాడు. ఇంకా కావాలని ఆకాశం వైపుకి ఎగిరినా ఆకాశమైన సింహాసనాన్ని చేరుకోలేవు. ఈ విధంగా దేవుడు మనిషి వెఱ్ఱి వేషాలు వేయకుండా పాదపీఠమైన భూమి మీద నిన్ను పెడుతూ సింహాసనమైన ఆకాశం మీద కూర్చుండి

ప్రకృతితో పాటు నిన్ను అనుక్షణం గమనిస్తూనే వున్నాడు. లేనిపోని తప్పుడు ఆలోచనలు, అక్రమపనులు, అబద్ధపు మాటలు ఆడినప్పుడు "నేల తల్లి సాక్షిగా" "నింగిసాక్షిగా", "పంచభూతములసాక్షిగా" అని వాటిని సాక్షులుగా పెట్టిన మనుష్యులు ఇక్కడ ఒక సంగతిని మరిచిపోకూడదు. ఎదుటివారిని నమ్మించటానికి వీటిని సాక్షులుగా నీవు పెట్టినా, పెట్టకపోయినా పుట్టినప్పటినుండి చచ్చునంతవరకూ దేవుడే నీపై వాటిని సాక్షులుగా పెట్టియున్నాడు. అంతేకాక నీవు పెట్టిన సాక్ష్యాలపై పాదములు లూని కూర్చున్నాడు. నీవు చేసిన ప్రతి తప్పిదమునకు సర్వేశ్వరుడు కూడా సాక్షేనని నీవు గుర్తుంచుకొనుట మంచిది. చేసిన తప్పు నెమ్మదిగా చేస్తూ లోకులను మోసగించుటకు సాతాను నీకు నేర్పిన ప్రకృతి మంత్రం అని దానిని చేయుచున్న నీవు ఇంకెంత తప్పు చేస్తున్నావో అది అతి ప్రమాదమని, తెలుసుకొనుటమంచిది.

**- ఆకాశము నా సింహాసనము, భూమి నా పాదములకు పీఠము, యెషయా 66:1.**

**- ఆకాశము తోడని ఒట్టు పెట్టుకొనువాడు, దేవుని సింహాసనం తోడనియూ, దానిపైన కూర్చున్న వాని తోడనియూ ఒట్టు పెట్టుకొనుచున్నాడు. మత్తయి 23:22.**

**ఎంత మాత్రము ఒట్టు పెట్టు కొనవద్దు. ఆకాశము తోడన వద్దు. అది దేవుని సింహాసనం. భూమి తోడనవద్దు. అది ఆయన పాదపీఠము మత్తయి 5:34,35.**

పైన వ్రాయబడిన వచనములను బట్టి బాల్యంలో నీ ఊహ చెడిననాట నుండే కాటికి చేరినంత వరకూ నీ బ్రతుకు బండారం ప్రకృతి బయట పెట్టగలదని ఏ పరిస్థితులలోనూ మరువద్దు. పిల్లి కళ్ళుమూసుకొని పాలు త్రాగినంత మాత్రాన లోకమంతా చీకటి అనుకుంటుంది. అలాగే మనిషి కూడా ప్రతి నీచకార్యాన్ని జరిగించి ఏ ఒక్కరూ చూడలేదని నిర్భయముతో బ్రతుకుచున్నాడు. నీ ముందున్న భవిష్యత్తు ప్రకృతి వలన అతి భయంకర పరిస్థితిల్లో చిక్కు కొన్నదని ఎరుగక బ్రతుకు దినము లన్నిటిలో సుఖపడుటకు యత్నిస్తాడు. కనులు తెరిచే లోగా (మృత్యువు) పరిస్థితులన్నీ తారు మారై వారికి, ఉన్న లోకానికి దూరమై పంచ భూతముల సాక్ష్యం ప్రకారం మండు గుండానికి చేరుకుంటాడు. భూమి మీద బ్రతికున్న ఏ మనిషికైనా ఇప్పుడీ మాటలు అర్ధం కావు. మృత్యు గుండం చేరగానే కావాలన్నా ఈ బోధ వారికి దొరకదు మనుష్యులను, చట్టాలను తప్పించుకొన్నా ప్రకృతి సాక్ష్యాలను, దేవునిని తప్పించుకోలేవు.

ఇట్టి మహాజ్ఞానాన్ని మీ ఇంటికి తెచ్చి మీముందుంచినా, విన్నవాటికి స్పందించక బ్రతుకును మార్చుకొనకపోతే నీకు పడే శిక్ష తీవ్ర స్థాయిలో వుండునని జ్ఞాపక ముంచుకొనుము. వినేవాడికి చెప్పేవాడు లోకువ అన్నట్లు ఏమీ తోచక మీ ముందుకొచ్చి బుద్ధి చెపుతున్నాడని అపార్ధం చేసుకొనవద్దు. అహోరాత్రులు మీ మార్పుకై యత్నిస్తూ బైబిలు నుండీ మహాజ్ఞానాన్ని బయటకు తీసి మీ ముందుంచుటలో అర్ధమేమనగా మీ ఆత్మలను రక్షించుటకేనని మరువవద్దు.

**- మీకు బుద్ధి చెప్పుచున్న నిరాకరింప కుండునట్లు చూచుకొనుడి. వారు భూమి మీద వుండి బుద్ధి చెప్పిన వానిని నిరాకరించినప్పుడు తప్పించుకొనక పోయిన యెడల, పరలోకమునుండి బుద్ధి చెప్పుచున్న వానిని విసర్జించు మనము తప్పించుకొనక పోవుట మరి నిశ్చయము గదా! హెబ్రీ 12:25.**

**ఇంత గొప్ప రక్షణ నిచ్చు బోధను మనము నిర్లక్ష్యం చేసిన యెడల ఏలాగు తప్పించుకొందుము? హెబ్రీ 2:3.**

**- ఆత్మ ప్రేరణతో వ్రాయబడిన వాక్యాన్ని తిరస్కరించిన వాడు ఎంత ఎక్కువైన దండనకు పాత్రుడుగా ఎంచబడునని మీకుతోచును? హెబ్రీ 10:29.**

దేవుడు వేసే ప్రశ్నలకు ఎట్టి సమాధాన మీయవలెనో మీరే ఆలోచించి చెప్పండి. ప్రకృతి దిగ్బంధంలో వున్న నరజాతి దేవునికి లెక్క చెప్పటంలో నిష్ఫలులు కాక తప్పదు. బ్రతుకంతా లోకంకై అంకితం చేసి దేవుని కొరకు ఫలించని అవిధేయులుగా కనబడుచున్నారు. సృష్టిలో వున్న మనిషి ఇప్పటికే వాక్యం లేకుండనే సృష్టికర్తను గూర్చి అనేక సంగతులను గూర్చి తెలుసుకొన వలసి వుండాలి. అనుభవించటానికి అలవాటుపడిన వారు ప్రకృతి ద్వారా దేవుని గూర్చి ఏమి నేర్చుకొనగలరు?

ఇదే ప్రకృతి వారి పట్ల శాపమై అంతమొందించుటకు మాత్రమే కాక, మనిషి చేసిన ప్రతీ నేరాన్ని బయట పెట్టుటకు సాక్షిగా నిలువబడు తుంది. ఈ విషయాన్ని కూడా ఇప్పటికే మీరు చదివియున్నారు. ఇకపోతే - **దేవుని గూర్చి తెలియశక్యమైన దేదో మనుష్యుల మధ్య ప్రకృతి వలన విశదమై యున్నది. దేవుడు అది వారికి విశద పరచెను. ఆయన అదృశ్య లక్షణములు అనగా ఆయన నిత్య శక్తియూ, దేవత్వమునూ, జగదుత్పత్తి మొదలుకొని సృష్టింపబడిన వస్తువులను ఆలోచించుట వలన తేటపడుచున్నవి. అందువలన నరులు తన కొరకు చెప్పుకొనలేక నిరుత్తరులై యున్నారు. మరియు వారు దేవుని నెరిగియూ ఆయనను దేవునిగా మహిమ పరచలేక, తేరగా అనుభవిస్తున్న ప్రకృతిని బట్టి కృతజ్ఞతలు చెల్లింపనులేదు. రోమా 1:19-21.**

కన్నులుండి చూడకయూ, చెవులుండి వినకయూనున్న వివేకము లేని మూఢులారా ఈ మాట వినుడి. **సముద్రము దాటలేకుండనట్లును, దాని తరంగము లెంత పొర్లిననూ అవి ప్రబల లేకయూ, ఎంత ఘోషించిననూ దాని దాట లేకడునట్లునూ నిత్య నిర్ణయముచేత దానికి ఇసుకను సరిహద్దుగా నియమించిన నాకు మీరు భయపడరా? నాసన్నిధిని వణకరా? ఈ జనులు తిరుగు బాటును ద్రోహమును చేయు మనస్సు గల వారు, వారు తిరుగుబాటు చేయుచూ తొలగి పోవుచున్నారు. యిర్మియా 5:21-23.**

ప్రకృతి వలన పాఠాలు నేర్చుకొనవలసిన మనము కేవలము దానిని అనుభవించుటకే అలవాటుపడి చచ్చినంతవరకూ దేవుని మాటవినక, బ్రతుకును సరిచేసుకొనక, ఆయన కొరకు బ్రతుకక తిండిపోతులము, సోమరులమై బ్రతుకు కాలాన్ని పాడుచేసుకుంటూ సృష్టికర్తపై తిరుగు బాటు చేయుచున్నాము. దేవుని ప్రేమ వలన ప్రకృతిలో జన్మించిన మనిషి ఆయన మాటలు విన్న తరువాత కూడా లేదా ఆయన మాటలు వినక ప్రకృతిని చూచిన తరువాత కూడా మారకపోతే వారు ఎట్టి భయంకర పరిస్థితులలో చిక్కుకొనెదరో ఈ క్రింది వచనాలను బట్టి గ్రహించుకొనగలరు.

- ఎవడైననూ నా మాటలు చెప్పే మిమ్మును చేర్చుకొనక మీ మాటలు వినకుండిన యెడల మీరు ఆ ఇల్లయిననూ, ఆ పట్టణమునైననూ విడిచిపోవునప్పుడు మీపాద ధూళి దులిపివేయుడి. **విమర్శదిన మందు వారి గతి కంటే ఆకాశము నుండి అగ్ని గంధకములు కురిపించి నాశనము చేయబడిన సొదొమ, గొమొఱ్ఱా ప్రదేశముల గతి ఓర్వదగినదై యుండునని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను. మత్తయి 10:14,15.**

**- మీ మాటలు వినకుండా వారు మిమ్మును చేర్చుకొనక పోయిన యెడల మీరు దాని వీధుల లోనికి పోయి - మీ పాదములకంటిన మీ పట్టణపు దూళిని కూడా మీ ఎదుటనే దులిపి వేయుచున్నానని చెప్పుడి. లూకా 10:10-12.**

- ఏ స్థలమందైననూ జనులు మిమ్మును చేర్చుకొని మీ మాటలు వినకుంటే, మీరు అక్కడ నుండి బయలు దేరునప్పుడు **"వారి మీద సాక్ష్యముగా" వుండుటకు మీ పాదముల క్రింద దూళి దులిపి వేయుడి. మార్కు 6:11.**

- సృష్టికర్త మాటలు వినక పౌలుకును, బర్నబాకును హింస కలుగజేసి, వారిని తమ ప్రాంతములు నుండి వెళ్ళగొట్టిరి. **అయితే వీరు తమ పాదధూళిని వారి తట్టు దులిపివేసిరి. అపొ॥కా॥ 13:50,51.**

**- దేవుని మాటలు వినక పౌలును ఎదిరించి దూషించినప్పుడు, అతడు తన వస్త్రములను దులుపుకొని - మీ నాశనమునకు మీరే ఉత్తర వాదులు. అపొ॥కా॥ 18:6.**

పైన వచనములన్నింటిలోనూ ధూళిని దులుపుట అనే మాటలు మనకు వినబడుచున్నవి. ఆ మాటలు వింటుంటే భయమును ఆవేదనయూ కలుగుచున్నవి. ప్రకృతిని పరిశీలిస్తే ఆకాశము కోటాను కోట్ల నక్షత్రములు, ధూళి మేఘములు మనమున్న సూర్య కుటుంబము కలిసి పది పాళ్లుగా మాత్రమే అంతరిక్ష శాస్త్రానికి కనబడుచున్నది. మిగిలిన తొంబై పాళ్ళుగ కనబడని పదార్ధంగాను, చీకటి పదార్ధంగాను, ప్రకృతిలో వున్నది. ఇది మానవ నేత్రాలకు కనపించని దేవుని సృష్టిని తెలుసుకొనవలెను. విశ్వం కట్టుదిట్టమైన దేవుని కార్యాక్రమాలకు లోనై అనేక శక్తుల సమ్మేళనంతో ప్రశాంతమై చక్రంగా తిరుగు చున్నది. ఈ ప్రకృతి చక్రంలోనే భూమి కేంద్రస్థానంలో వుండగా అది జీవి నివాసయోగ్యానికి అనుకూలంగా

దేవుడు మలుచుటను బట్టి మనిషి తన మనుగడను కొనసాగించు కొనుచున్నాడు. అనంతమైన విశ్వచక్రంలో కంటికి కనబడనంత చిన్న చుక్కగా భూమి కేంద్రస్థానంలో వుండి మన అవసరతలను తీర్చుచున్నది. అందువాసము చేయుచున్న నీవు కన్నతండ్రియైన దేవుని మాటను పెడచెవిన పెట్టినయెడల అందున్న ధూళి మీకు బోధించుటకు వచ్చిన వారి పాదములనుండి రాలి నీకు వ్యతిరేకంగా సాక్ష్యమిచ్చి సొదొమ, గొమొఱ్ఱా పట్టణాలకంటే భయంకరంగా నిన్ను మాడ్చిమసి చేస్తుందని తెలుసుకొనగలవు. దూళినన్నేమి చేయగలదని విఱ్ఱ వీగితే ప్రకృతిచక్రమే ధూళి, ధూళికణాల మయమని మర్చిపోవద్దు. ఎదుట మనిషితో నీవు ఆట ఆడితే హాని జరుగదేమో గాని దేవునితో మాత్రం ఆటలాడకు. నీవు నడిచేనేల, పీల్చేగాలి, భుజించే ఆహారం, త్రాగేనీళ్లు అనుభవించే సమస్తం దేవుని మాటవలన కలిగిన ధూళిమయమైన ప్రకృతి అన్నమాట మర్చిపోవద్దు. కడకు కోట్లకణాలతో నిర్మితమైన, నీవు ధరించిన ఈ శరీరమే ప్రకృతిలో ఒక భాగమై నీకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పడానికి సిద్ధపడుతుంది. నీ శరీరమే నీకు శత్రువు అన్న మాట మర్చిపోవద్దు.

**- అయ్యో నేనెంత దౌర్భాగ్యుడను. ఇట్టి మరణమునకు లోనగు నాశరీరమునుండి నన్నెవడు విడిపించును? రోమా 7:24.**

కడకు నీవు నమ్ముకున్న నీ శరీరమే నీకు ఆపద తలపెట్టేదిగా కనబడుచున్నది. దేని కొరకు నీ బ్రతుకు కాలాన్ని బలిచేసావో దేని ఆశలను నెరవేర్చుటకు బ్రతుకంతా ఊడిగం చేసావో పంచభూతముల నుండి తీయబడిన అదే శరీరము ధూళికణాలతో నిండుకొని శరీర కణాలుగా మారి ఈ రోజు ఆత్మగా వున్ననిన్ను మట్టి ఆకారంలో దాచుకుంది. ఈ కాలంలో నిన్ను కనిపెట్టే మరో అంగరక్షకుని అవసరత లేకుండా నీ శరీరమే నీకు సాక్షిగా నీ దిన చర్యను వ్రాసి భద్రపరచుచున్నది. ప్రకృతి అంతా ఒక్కటే గనుక నీవు దేవుని కుమారుడవో లేక దుష్టుని సంబంధివో నిర్ణయం నీ శరీరమే తీసుకొన వలసివుంది. కనుక మృత్యుదినానికి తనలోనుండి నన్ను బయటకు గెంటి వేయుచున్నది. నాది అనుకున్న నీ శరీరమే నీకు కాకుండా అన్యాయం చేసినప్పుడు నీ పరిస్థితిని, నీ వేదనను చచ్చిన తరువాత ఎవరితో చెప్పుకొందువో ప్రస్తుతం నీ శరీరంలో వుండగానే ఒక మంచినిర్ణయాన్ని తీసుకొనుట మేలు. నీతో కలిసినప్పుడు మాత్రం శరీరం కిమ్మనక వుండువేమోకానీ, నిన్ను విడిచిన తరువాత ప్రత్యక్షసాక్షిగా నీకు వ్యతిరేకంగా దేవుని న్యాయస్థానం ముందు నిలువగలదు. ఇంత మహాజ్ఞానాన్ని నేర్చుకున్న నీవు భూమి మీద వున్న కాలంలో ప్రకృతివలన వచ్చే కీడుకంటే, చచ్చిన తరువాతే దీని వలన నీకు మరి ఎక్కువ కీడు కలుగును. ప్రపంచ విద్యాలయాల్లో నీవు నేర్చుకొనని ఈ మహాజ్ఞానాన్ని తీవ్రంగా ఆలోచించి ఇప్పటికైనా మించింది లేదుకనుక భూమిమీద వుండగానే, శరీరంలో నిలిచి వుంటుండగానే మంచిసాక్ష్యాన్ని పొందుటకు ప్రయత్నించుము. ప్రయాసపడుము.

నీవు నమ్ముకున్న నీ శరీరము అనుభవించే ప్రకృతి నీ అనుదిన చర్యలో దేవుని పట్ల చూపిన అవిధేయతకు సాక్షులుగా నిలబడితే నీ పరిస్థితి ఎంతదుర్భరంగా మారునో ఇప్పటికైన ఆలోచించగలవు. సృష్టి ఆరంభదినాలనుండి మానవుడు నమ్మకంగా వున్నంతవరకూ ప్రకృతి నీ పట్ల చూపిన ప్రేమ, సంతోషాన్ని బైబిలు నుండి నీవు చూడగలగాలి. ఏలయనగా

**- దేవుని కుమారుల ప్రత్యక్షతకొరకు సృష్టి మిగుల ఆశతో తేరిచూచుచూ కనిపెట్టుచున్నది. రోమా 8:19.**

**- అరణ్యమును, ఎండిన భూమియూ సంతోషించును అడవి ఉల్లసించి కస్తూరి పుష్పమువలె పూయును. అది బహుగాపూయుచూ ఉల్లసించును. ఉల్లసించి సంగీతములు పాడును. అవి యెహోవా మహిమను, దేవుని తేజస్సును చూచును. యెషయా 35:1,2.**

**- ప్రభువా, మా దేవా, నీవు సమస్తమును సృష్టించితివి. నీ చిత్తమును బట్టి సృష్టింపబడినవి యుండెను. దానిని బట్టియే సృష్టింపబడెను. గనుకనీవే ఘనత, మహిమ, ప్రభావములు పొందనర్హుడవు. ప్రకటన 4:10,11.**

**- యెహోవా, వాక్కుచేత ఆకాశములు కలిగెను. ఆయన నోటి ఊపిరిచేత వాటి సర్వసమూహము సృష్టింపబడెను. సముద్రజలములను రాశిగా కూర్చువాడు ఆయనే. ఆయన మాట సెలవియ్యగా ఆ ప్రకారమాయెను. ఆయన ఆజ్ఞ పంపగానే కార్యములు స్థిరపరచబడును. కీర్తన 33:6,7,9.** దేవుని అనాది సంకల్పమును బట్టి సర్వసృష్టి ఆయన పిల్లల

విషయమై సంతోషించుచూ పుట్టబోయేవారసులకు సకల పరిచర్యలు అందించాలన్న ఆనందంతో దేవుని కుమారుల ప్రత్యక్షత కొరకు ఎదురుచూచింది. ఆ సంతోషం మూన్నాళ్లైనా కాకముందే మొదటి మానవుడి అవిధేయత వలన కడకు ప్రకృతి కూడా నాశనమునకు లోనైనదని మీకు తెలుసు. వాటి నుండి సృష్టి నిజమైన దేవుని పిల్లల కొరకు మిగుల ఆశతో తేరిచూచుట ఆరంభించినది. దేవుని జ్యేష్టకుమారుడైన యేసురాకతోనైన ఆయన పిల్లలు మారగలరన్న మరో నిరీక్షణతో సృష్టికనిపెట్టుట మరలా జరుగుచున్నది. ఏది ఏమైనా మనిషిలో మార్పురాక ఒకప్రక్క దేవుడు, మరోప్రక్క సృష్టి ఆందోళనకు గురియైతిరని చెప్పక తప్పదు. పిల్లల మీదవున్నకోపాన్ని యజమాని పనివాని మీద చూపిస్తాడన్నట్టు అవిధేయులైన మనలను బట్టి పరలోకపుతండ్రి ప్రకృతిని శపిస్తున్నాడు. అందునుబట్టి ఎవరి సేవ నిమిత్తం ప్రకృతి సృష్టింపబడినదో, అట్టి జనానికి వ్యతిరేకమై ప్రకృతికన్నెర్ర జేయటం ఆరంభించినది. ప్రకృతి ఒడిలో ప్రశాంత జీవనం చేయవలసిన దేవుని కుమారుడు చేసిన శాపానికి అదే ప్రకృతితో తండ్రి వలన దండింపబడుచున్నాడని గతసంచికలో మీకు వివరించితిని. తమ్మును పుట్టించిన దేవునికి ప్రకృతి విధేయతను ప్రకటించుకున్నదేగానీ, దేవుని స్వరూపమందు, పోలికగా జన్మించిన నరుడు మాత్రం దేవునిని మరచి అవిధేయుడై భూమి మీద కాలమును గడుపుచున్నాడు. తన పిల్లల యెడల దీర్ఘశాంతముతో - వాక్యప్రకటన ద్వారా ఎప్పటికైనా నా పిల్లలు మారుతారన్న ఆలోచనతో తప్పిపోయిన కుమారుని తండ్రివలె తన పిల్లల రాకకొరకు ఎదురుచూస్తునే వున్నాడు. అందుకే ఈ మహాజ్ఞానాన్ని ప్రపంచవ్యాప్తం చేయుచున్నాము. మా సువార్త ప్రకటన ద్వారా సమాజాన్ని చైతన్య వంతం చేస్తూ లోకజ్ఞానాన్ని చిత్తుగా ఓడిస్తూ దేవుని ప్రేమను పొందుతూ విజయోత్సవంతో ఊరేగింపబడుచున్నానని దేవుని బట్టి చెప్పుచున్నాను. అంత్యకాలపు పిలుపని, చివరి ఘడియ మేలుకొలుపని 1900 వందల సంవత్సరాల తరువాత పరలోకపు తండ్రి ఉనికిని కాపాడుటకై సవాళ్ళతో ప్రపంచం ముందు నిలిచియున్నాను. ఈ రాజ్య సువార్త ప్రకటనతో జ్ఞాని, శాస్త్రీ, తర్కవాదులను, బహిరంగంగా ఎండగడుతూ దేవుని ఉనికిని కాపాడుచున్నాను. ఆశలు చూపి, జనాన్ని మోసగించక వాస్తవాలను వెలుగులోనికి తెచ్చి సమాజాన్ని మేల్కొలుపుచున్నాను. ఒకనాడు యేసు మృత్యుంజయుడై లేచిన తరువాత ఈ మహాజ్ఞానాన్ని ఎవరికి భోధించమన్నాడో ఈ క్రింది వచనాలను మీరు చదివితే ఆశ్చర్యపోతారు. ఎట్లనగా **- మీరు సర్వలోకమునకు వెళ్ళి సర్వసృష్టికి సువార్తను ప్రకటించండి. మార్కు 16:15.**

**- మీరు విన్నట్టియూ, ఆకాశము క్రింద నున్న సమస్తసృష్టికి ప్రకటింపబడినట్టియూ ఈ సువార్త వలన కలుగు నిరీక్షణ నుండి తొలగిపోక విశ్వాసమందు నిలిచి యుండిన యెడల ఇది మీకు కలుగును. కొలస్సీ 1:23.**

"సర్వలోకమునకు వెళ్ళి" అనుమాట లోకములోని మనుష్యులందరి దగ్గరకు వెళ్ళి అని అర్థమిచ్చుచున్నది. అయితే "సర్వసృష్టికి" సువార్తను ప్రకటించుడి అను మాట అపొస్తలులు, శిష్యులు ప్రకటించిన సువార్తను సృష్టింపబడిన ప్రకృతికూడా వినదని తేటతెల్లమగుచున్నది. ఆయన మాటలలో ఆత్మయు, జీవముంటే - అదే మాటల వలన కలిగిన సృష్టి వారు ప్రకటించిన సువార్త విని ప్రపంచ ప్రజలపై సాక్షిగా ఉండుటకే ప్రకృతికి సువార్త ప్రకటన జరిగిదని గుర్తించగలము. అలాగే ఆకాశముక్రింద వున్న సమస్త సృష్టికి మీరువిన్న సువార్తే ప్రకటించబడినదని కొలస్సీ పత్రికలో రాయబడినది. పై రెండు వచనాలను సుదీర్ఘంగా ఆలోచిస్తే మనుష్యులకు సువార్త ప్రకటించబడినదని సృష్టిని మనపై సాక్ష్యంగా నిలువబెట్టుటకై సర్వసృష్టికి సువార్తను ప్రకటించుడి అన్న పదాన్ని తండ్రి పరిశాద్ధాత్మవలన వ్రాయించి యున్నాడు. ఇకపోతే మరో ఆశ్చర్యకరమైన వాక్యాన్ని చదివితే మనకు మతి పోతుంది.

**- మేము "లోకమునకును", "దేవదూతలకునూ", "మనుష్యులకునూ" వేడుకగానున్నాము. 1 కొరింథీ 4:9.**

దేవుని జ్ఞానాన్ని ప్రకటించువారిని 1. లోకమునకునూ, 2. దేవదూతలకును 3. మనుష్యులకును వేడుకగా వున్నారని పౌలు ఇక్కడ వ్రాయుచున్నాడు. సువార్త కేవలం మనుష్యులకు మాత్రమే అనుకుంటే పొరపాటు ఎందుకనగా అది ప్రకటింపబడిన సంగతి లోకము (సృష్టికి), దేవదూతలకు కూడా అవసరమని తెలియుచున్నది. మనుష్యులకు ప్రకటించినదీ, లేనిదీ, దానిని వారు స్వీకరించినదీ, లేనిదీ సాక్ష్యం చెప్పవలసిన భాద్యత లోకమునకు, దేవదూతలకునూ వున్నదని

అర్థమగుచున్నది. భాషా జ్ఞానం లేని సృష్టికి సువార్తను ప్రకటించుట ఏమిటి? అని ఆలోచనలో పడ్డారు. అదేవిధంగా దేవదూతలకు అదే ప్రకటనలు ఎందుకని కూడా ఆలోచించుచున్నారు. మిమ్ములను ఆలోచింపచేయుటకే ఈ సంచలనాత్మక రచన మీముందుంచుచున్నాను. ఏ సువార్త మనుష్యులకు ప్రకటింపవలసివున్నదో ఆ సువార్త ప్రకటింపబడినదని సృష్టికినీ, దేవదూతలకునూ తెలియవలసివున్నది. ఎందుకనగా నిన్ను నిత్యజీవానికో, నిత్యనరకానికో పంపవలసిన నిర్ణయాన్ని సృష్టి, దేవదూతలు చెప్పేసాక్ష్యాల మీదే ఆధారపడియున్నది. మిమ్మును ఆశ్చర్యంలో ముంచెత్తే మరో సందర్భాన్ని బైబిలు నుండి ఈ క్రింద వ్రాయుచున్నాను. **- దేవుడు మన ప్రభువైన క్రీస్తు యేసునందు చేసిన నిత్యసంకల్పంచొప్పున పరలోకంలో "ప్రధానులకునూ", "అధికారులకునూ" సంఘము (మన ద్వారా దేవుని యొక్క నానా విధమైన జ్ఞానము ఇప్పుడు తెలియబడవలెనని దేవుడు కోరుచున్నాడు. ఎఫెసీ 3:8-11.**

క్రీస్తు రక్తంచేత కడుగబడిన పరిశుద్ధ సంఘమైన మీ ద్వారానే దేవుని యొక్క మహాజ్ఞానం పరలోకంలో గల మహామహులైన దేవదూతలకు కూడా తెలియపరచబడాలని దేవుని కోరిక మేరకు నేడు ఇట్టి మహాజ్ఞానాన్ని ప్రకటించవలసివున్నది. వారానికి ఒకదినం గుడికి వెళ్ళి ఒక గంటకూర్చున్న నీకు బహుశా ఈ మాటలు అర్థం కావేమో. కేవలం వినుటకు వెళ్ళే నీవు సువార్త ప్రకటనలకును, అధికారులకునూ తెలియాలని దేవుడు కోరుకుంటున్నాడు. ఈ విధంగా నీవు చేయగలిగితే సర్వసృష్టితో పాటు దేవదూతలు కూడా నీ సేవకు తన్మయత్వమై నిన్ను చూడాలని ఆశ పడుచున్నారు. మనకు వాక్యం ప్రకటించువారిని **- దేవదూతలు తొంగి చూడగోరుచున్నారు. 1 పేతురు 1:12.** నమ్మకమైన దేవుని పిల్లలుగా నిన్ను నమ్మిన దేవుని సంకల్పాన్ని నెరవేర్చుటకై సువార్త ప్రకటనలో నీవుంటే సృష్టితోపాటు దేవదూతలు కూడా నిన్ను చూచి ఆనందించాలని అట్లు కానియెడల నీకు వ్యతిరేకమై సాక్ష్యం ఇవ్వాలని నీ దినకార్యక్రమాలన్నింటినీ దేవునితో పాటు నిన్ను గమనిస్తున్నవని ఇప్పటికైనా నీవు తెలుసుకొనుట మంచిది.

వ్రాయబడిన మహాజ్ఞానంలోని సందర్భాలను కేవలం చదివి మరుచుట మాత్రమేగాక బ్రతుకులో జరిగించి, అందుజీవించి దేవుని ఇష్టాన్ని నెరవేర్చగలరని ఆశిస్తున్నాను.

